# జ్ఞాన దీపిక

(కవితా సంపుటి)

**సందాపురం బిచ్చయ్య**

సీనియర్ హిందీ పండిట్



**శ్రీ లక్ష్మీనరసింహ స్వామి పబ్లికేషన్స్**

నాగవరం (గ్రామం) వనపర్తి (మండలం)

మహబూబ్ నగర్ (జిల్లా) - 509 103.

# ఒక మాట

శ్రీ సందాపురం బిచ్చయ్య గారు కవి పండితులు భావనాశీలురు. ప్రతి విషయమున పరిశీలనాదృక్పథము కలవారు వారి భావనా, పరిశీలనాదులు భారతీయ సంస్కృతి మార్గమున పయనించుచుండును. వారు ఉపాధ్యాయులు ఆ వృత్తి వారిని కేవలం ఉపాధ్యాయునిగానే ఉంచలేదు. సహజ భావనా ప్రపంచమున విహరించుటకు సహకరించినది. వారి భావనా పటిమను రాణింపచేసినది. సంప్రదాయానుబద్ధ సంస్కృతి వైభవమును అక్షర రూపమున లోకమున కందించుట యుక్తమని ప్రోత్సహించినది. ఆ ప్రోత్సహముతో వారి యందు నిగూఢముగా బయలు వెడలినది. వారిని ఆత్మానందమయులను చేసినది.

"ఆత్మానందము, సూక్తి దీపిక, జ్ఞాన దీపిక" ఇత్యాది గ్రంథములు వారి భావనానైపుణ్యమునకు, కవితా సౌందర్యమునకు ఉదాహరణములు. అంతేకాదు నృహరి శతకము వారి భక్తి భావనకు ఉదాహరణము, నిదర్శనము.

శ్రీ బిచ్చయ్య గారు "సూక్తి దీపిక" అను గ్రంథమును రచించి అంతటితో తృప్తి చెందక ప్రకృతమున "జ్ఞాన దీపిక" యను చిన్ని గ్రంథమును రచించినారు. వారి గ్రంథములకు దీపిక యను నామకరణము చేయుట మనము ప్రధానముగా గమనించవలసిన విషయము. ప్రతి వారు సూక్తిని, జ్ఞానమును దీపికారూపమున దర్శించవలయునని వారి భావన. సూక్తులు పాఠకుల హృదయమునందు క్రొత్త తేజమును వెలిగింప చేయగలవనియూ వారి భావన.

అయితే సూక్తి దీపిక అన్నను "జ్ఞాన దీపిక" యన్నను రెండును యధార్థమునకు సూక్తి రూపములే, కాని వారు ప్రత్యేకించి సూక్తి దీపికను రచించినను జ్ఞాన దీపికయను పేరుతో మరియొక గ్రంథము వ్రాయుట వారి హృదయమున గల అర్థగాంభీర్యమును సూచించుచున్నది. పాఠకులు ఎన్ని సూక్తులు చదివినను వారికి జ్ఞానోదయము కలుగని యెడల వారి సూక్తి పఠనము వ్యర్థమే యగుచున్నది. ఈ విషయము వారి జ్ఞానదీపిక యందలి ఈ పద్యము సుస్పష్టపరుచుచున్నది.

*వేదములు నాలుగు చదివి వేత్తయైన*
*ధర్మశాస్త్రాలు చదువు మేధావి యైన,*
*సద్గురుని వద్ద సర్వంబు చదువకున్న*
*వ్యర్థమగు వాని జన్మ వసుధయందు*
*కాయగూరలతో తిరుగాడు గరిటసమము.*

ఈ పద్యమున సూక్తులు ఎన్ని చదివినను ప్రయోజనము లేదనియు గురు సుశ్రూష చేసి తదనుగ్రహమున జ్ఞానమును పొందవలెననియు, జ్ఞానమే మోక్షమునకు తరణ సాధనమనియు చెప్పబడుచున్నది. అట్టి జ్ఞానము యొక్క ప్రాధాన్యము ఈ "జ్ఞాన దీపిక" యను గ్రంథము తెలియ జేయుచున్నది. "నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహవిద్యతే" యను సూక్తి తాత్పర్యరూపమే ఈ జ్ఞాన దీపిక.

ఇట్లు జ్ఞానానుభూతి ప్రాధాన్యమును బోధించు ఈ జ్ఞానదీపిక పాఠకులకు కర దీపికగా కాగలదని, కావలయునని ఆశించుచున్నాను. ఇట్టి జ్ఞాన దీపికను పాఠక లోకమునకు అందించు శ్రీ బిచ్చయ్య గారు సర్వదా, సర్వథా అభినందనీయులు.

మరియొక్క చిన్న విషయము శ్రీ బిచ్చయ్య గారి కవితయందు "నృహరీ శతకము", "భార్యభర్తలు" ఇత్యాది ప్రయోగములు కన్పించవచ్చును. అట్టి ప్రయోగములు కావ్య సంసారమున కవి యొక్క స్వాతంత్ర్యమును సూచించినవియే అగుచున్నది.

శ్రీ బిచ్చయ్య గారు ఇట్టి కవితలు రచించుచూ సదా సారస్వతా సేవ చేయుచూ శ్రీ శారదాదేవి అనుగ్రహమునకు పాత్రులు అగుదురుగాక.

శుభమస్తు

సందాపురం శ్రీ బిచ్చయ్యః భావుకః జ్ఞాన దీపకః
దీవ్యతాత్ భక్తి నమ్రస్స్వః ఆత్మానందమయస్సదా

హరిలక్ష్మీ నరసింహ శర్మ

అడ్రస్సు
శోదన్ పేయింట్స్,
1-6-39/A,
పాల్ సాబ్ గుట్ట,
మహబూబ్ నగర్ – 509 001

# ప్రతి ఒక్కరికి కరదీపిక
# ఈ జ్ఞాన దీపిక

శ్రీ సందాపురం బిచ్చయ్య ఎన్నదగిన కవులలో ఒకరని నా అభిప్రాయం. సంప్రదాయ సరళిలో కవిత్వాన్ని సృష్టించి కొంగ్రొత్త రీతిలో పరిమళాలను వెదజల్లగల శక్తి, ప్రతిభ, సామర్థ్యం ఈయనకు ఉన్నాయనడంలోసందేహమే లేదు. ఈయన భావాలు మడి కట్టుకుని కూర్చునేవి కావు. మందలించి వదలిపెట్టేవి కావు. నిజానిజాలు వెలికి తీసి మనిషిని లోక శ్రేయో క్రియాశీలునిగా మలిచేవి. ఆదర్శవంతంగా తీర్చిదిద్దేవి కవిత్వంలో ప్రాణమే లేకపోతే ఇది సాధ్యంకాదు. ప్రాణం ఉన్న కవిత్వం రసవంతంగా స్ఫూర్తిదాయకంగా ఉంటుదనడంలో రెండో ఆలోచనే లేదు. ఇటువంటి కవిత్వాన్ని అందించే అరుదైన కవులలో శ్రీ బిచ్చయ్య ఒకరు.

ఒకోమారు అల్లిక అంత అందంగా నప్పకపోయినా గంభీరమైన భావంతో పలుకరిస్తుంది. మరోమారు చాలా తేలికగా అలోచన మరచిపోలేని అనుభూతిని కలిగిస్తుంది.

ఎంతో శక్తివంతమైన కవిత్వాన్ని రాసే శ్రీ బిచ్చయ్యలో మూర్తీభవించిన వినయం, విజ్ఞత చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. అలనాటి మహర్షుల వారసత్వం అబ్బినట్లు తోస్తుంది. మహబూబ్ నగర్ జిల్లా లాంటి వెనుకబడిన ప్రాంతంలో ఉంటూకూడా ముందు ముందు తరాలవారికి మార్గదర్శిగా భాసిల్లగలిగే రమణీయమైన అతికమనీయమైన కవిత్వాన్ని ఈయన రాయడం ఎవరికైన ఆశ్చర్యం కలిగించవచ్చు.

గంధపు సువాసన ఎక్కడైనా ఒక్కటే అన్నది జగమెరిగిన సత్యం.

యోగముల్ జేసి, తీర్థములందు మునిగి
దానముల్ జేసి, క్షేత్రాల తనువు దిరుగ
లక్ష్యసిద్ధిని బొందరు లావు జనులు
సాధు దర్శనమున గల్గు, సకలసిద్ధి

అనడంతో మహాకవి వేమన జ్ఞప్తికి వస్తాడు. లావు జనులు అనే ప్రయోగంలో ఎంతో అర్థం, ప్రయోజనం ఉంది. ఇదే విధంగా ఈయన "భార్య భర్తలు" అనే ప్రయోగం చేసాడు. లాక్షణికులు తప్పుపట్టకుండా ఉండాలంటే భార్య, భర్త అంటే సరిపోతుంది. అయినా కవి సర్వ స్వతంత్రుడు కదా.

గురువు యొక్క గొప్పతనాన్ని తెలుపుతూ "బ్రహ్మనిష్ఠలో యున్నట్టి బాలుడైన వాని దరి జేరి పూజింప వలయు భువిని." అని స్పష్టంగా ప్రకటించాడు ఈ కవి. నీచాచార్యులను విసర్జించాలని మనవి చేసాడు కూడా.

"దేహమంతట పరమాత్మ తిరుగుచుండు" అనే మాట చాలా గొప్పది. ఎంతో శక్తివంతమైనది. స్వామి వివేకానందుని గుర్తుకు తెచ్చేది. అహం బ్రహ్మాస్మి అనే మాటకు దరిదాపుగా సమానమైంది. శ్రీ బిచ్చయ్య అంతర్మూర్తి ఆత్మానందలహరిలో తొణికిసలాడుతున్నట్లు నాకు తోస్తోంది.

"భక్తి యొక్కటే పరమాత్మ పంచజేర్చు" అనే నిర్ధారణ అమోఘమైనది. అత్యంత విలువైనది. భక్తురాలు మీరాబాయి చెప్పిన మాట కూడా యిదే. భక్తి పారవశ్యాన్ని మించిన ఆనందం మరొకటి ఉండదు. కవిత్వానికి భక్తి కూడా తోడైతే కావ్యం కడురమ్యమే కాదు, లోకప్రియం కూడా అవుతుంది. ఇందులో అనుమానాలకు ఆస్కారమే లేదు.

కులాలను ఎంచని మంచి కవి బిచ్చయ్య గారు. ఈయన

మనిషిలో గుణగణ మహనీయ శక్తిచే
బ్రహ్మ, క్షాత్ర, శూద్ర, వైశ్య, కులము
లెంచవచ్చుగాని ఇల్లు ఒడలు, బట్టి
ఏర్పడదు కులంబు ఎచ్చటైన

అని స్పష్టంగా ప్రకటించాడు. సంస్కారం ఉన్నవారే బ్రాహ్మణులు. అది లేని వారు శూద్రులేనని వెల్లడించాడు. ఈ వాస్తవాన్ని గమనించవలసిన అవసరం మనకందరికీ ఉంది.

'చిత్తమెవ్వని అరచేత చిక్కెనేని
మూడు లోకాలు వానిచే ఓడిపోవు'

మనస్సు ఆధీనంలో ఉంచుకున్న వాడే సమ్రాట్టు కాగలడని ప్రాజ్ఞుల బోధ. ఈయన మాటలూ ఆ కోవకు చెందినవే. మనస్సు చంచలమైతె పతనపు అంచుల్లో ఉన్నట్లే. ఈ మాటల్ని చాల చక్కగా, పొందికగా, మనస్సుకు హత్తుకుని పోయేటట్లు చెప్పిన శ్రీ సందాపురం బిచ్చయ్యను అభినందిచక తప్పదు.

పరస్త్రీ వ్యామోహం ఎంతటి వివేక భ్రష్ట సంపాతుడిని చేస్తుందో రామాయణం చెబుతూనే ఉంది. ఆ మొత్తం సారాన్ని నాలుగు మాటల్లో మనముందు పెట్టగలిగాడు ఈ కవి.

ధనము నశియించు వెలయాలి తనువు గోర
మాన మంతరించును దాసి మైధునమున
ఆయువంతరించు విధవ, పాయిగిల్ల
అంతరించు సర్వము, అన్యకాంత వలన.

విప్రనారాయణుడంతటి వాడే ఈ మైకంలో కొట్టుకుపోయి, కన్నుతెరచి పాండు రంగడి అనుగ్రహంతో ముక్తిని పొందగలిగాడు. ఆత్మ నిగ్రహంచాలా అవసరమని గాంధీ సైతం తరచూ చెప్పేవాడు.

ఈ పద్యంలో పాయిగిల్ల అనే ప్రయోగం హుందాగా లేదు. అంతమాత్రాన అర్థవంతంగా లేదని కాదు. శ్రీనాథుని క్రీడాభిరామం లో ఇటువంటి ప్రయోగాలు కోకొల్లలు.

ఇలాగా చెబుతూ పోతె జ్ఞానదీపిక ఏనాటికీ ఆరిపోని విజ్ఞాన దీపికే అని అన్పిస్తుంది. ఈ కవి కలం నుంచి మరిన్ని మంచి రచనలు రావాలని కోరుతూ......

శుభం భూయాత్ !

విశ్వమిత్ర, సాహిత్య భాస్కర, కళా ప్రపూర్ణ
డాక్టర్ గుమ్మనూరు రమేష్ బాబు

# కవి పలుకులు

శ్రీయుత ప్రియాత్మ స్వరూపులందరికి నా ప్రణుతులు సమర్పించుచూ తెలియ జేయు విషయము ఏమనగా నేను కొందరి మహాత్ముల రచనలు చదివి అందులోని సారాన్ని సేవించి సంతసించుచూ నాకు తెలిసినంత వరకు జ్ఞానాన్ని కొంత సమాజానికి అందించి ఆనందింపజేయాలను తపన చేత వ్రాసి ఈ జ్ఞాన దీపికను మీ ముందు ఉంచుతున్నాను. అంతేకాని అభిజ్ఞులచేత అవార్డులు అందుకోవాలను ఆకాంక్ష చేతగాని, అభినందన మహా సభలు జరిపించుకొని ప్రశంసల పత్రాలను పొంది ఆనందించాలను అభిప్రాయము కల్గి వ్రాసిన వ్రాతలు కానే కావు. ఈ లోకములో మానవులందరు మానవత్వముతో మెలగుచూ అందరు ఆనందముగా ఆరోగ్యముగా జీవనం గడుపాలను సంకల్పము మాత్రమే నాలో సదా ఉంటుంది అందులోని భాగమే ఈ జ్ఞానదీపిక

ఈ మానవ కోటిలో కొందరు అనేక దుష్టబుద్ధుల ప్రభావము చేత చేయు చేష్టలకు ఫలితము ఎలా అనుభవిస్తుంటారోమీకందరికి తెలుసు. మానవజాతి సంసార సాగరములో విషమ సమస్యల అలల ధాటికి తట్టుకొనలేక తికమక పడి అధోగతి పాలు కావడము చూస్తూనే ఉన్నారు. మానవ సేవ చేయాలను కోరిక చేత మనోవికారాలను నశింపజేసి మనోవికాసాన్ని అభివృద్ధి చేయాలనియు అందరికి ఆత్మానందమును కలిగించు మార్గము చూపాలనియు ఆశయము నాలో ఎల్లప్పుడు ఉంటుంది. అందులకై మాత్రమే నా కలము కదలుతూ ఉంటుంది.

ఈ జ్ఞాన దీపికను గురించి ఎందరేమన్నను సహించడానికి సిద్ధముగా ఉన్నాను. తెగడిన పొగడిన సంతోషముగా స్వీకరిస్తాను. నేను కొందరి మేలు మాత్రమే కోరను. అందరి మేలు కోరే వారిలో నేనూ ఒకడను.

సమాజ శ్రేయోభిలాషులై రచనలు సాగించు కవులలో నేనూ ఒకడను.

జైహింద్

– యస్. బిచ్చయ్య



గీ. మాన మవమాన మెప్పుడు మానవులకె,
వచ్చు చుండుట సహజంబు, వసుధ యందు.
మందహాసము తోడను, మందలించి,
సాగనంపుచు, బ్రతుకు సంసారమందు !

## సాధు దర్శనము

గీ. యాగముల్ జేసి, తీర్థము అందు మునిగి
దానముల్ జేసి, క్షేత్రాల తనువుదిరుగ
లక్ష్యసిద్ధిని బొందరు లావుజనులు
సాధు దర్శనమున గల్గు, సకల సిద్ధి.

గీ.. గంగ యందున మునగ, అఘంబు పారు
చంద్రకిరణము సోకగ, చలువ నిచ్చు
మూడు వరములు గాకను ముక్తినిచ్చు
సాధు దర్శనమున గల్గు సర్వసిద్ధి

గీ. తీర్థయాత్రలు సకలంబు, తిరిగి యున్న,
శాస్త్రపఠనంబు లెస్సగా చదివి యున్న,
మోక్షమబ్బదు జపతపామోదికైన,
బ్రహ్మనిష్ఠ, సదాచార ప్రాణిసేవ
చేయకుండిన, మోక్షంబు చేరరాదు.

## గృహస్థ ధర్మము

గీ. భార్యభర్తల కీశుపై భక్తి యున్న,
సత్య నిష్ఠులై సంసార సాగరంబు,
భార ముండదు దాటగా బాధపడరు,
చెరవులో జలధారలు చేరునట్లు,
సకల సంపద సమకూరు సదనమందు.

గీ. ఎవ్వడొక్కము హూర్తమునేక దృష్టి,
నాసికాగ్రమునందుంచి నయముగాను.
దైవనామము జపియింప ధరణి యందు
నూరు జన్మల పాపాల పోరు బాయు

## జపము

గీ. ఏక, బహువచన, విభక్తి, ఎచట లేక,
పుం, నపుంసక స్త్రీలింగములును లేక.
నామరూప, గుణ రహిత నాదమయ్యి
పలుకు నోంకార శబ్దంబు ప్రాభవముగ
జపవిధాన మెరిగియును జపము జేయ
యజ్ఞఫలితంబు కంటెను, అధిక మిచ్చు

గీ. ఎవ్వడొక్క క్షణము పరమేశు జపము
జేయ వాని, పాపములెల్ల చిదిగి పోవు
భానుడుదయింప చీకటుల్ పారినట్లు
విషయ వాసన పులులన్ని వెడలి పోవు

## అపథ్యాహారము

గీ. పులుపు, కారము, చేదుప్పు, పులికడుగులు
ఉలవ రేగుపండింగువ, ఉల్లి, ఎల్లి,
ఆకు కూర నువ్వులు, నూనె, ఆవ, కల్లు,
మధువు మాసంబు వెల్లుల్లి మాన్యులకును
వర్జనీయంబు మజ్జిగ వరుసగాను

# పథ్యము

గీ. గోదుమలు, వడ్లు, యవలు, శుద్ధోదనంబు
తిప్ప తీగ, పచ్చ పెసలు, తేనె, శొంఠి,
పంచదార, వెన్నయు, పాల్ల, పంచశాఖ
ములను, కండచక్కెర, నెయ్యి ముదమునిచ్చు
ధైర్యమారోగ్య నిర్మల దాయకములు

# జీవకారుణ్యం

గీ. మాంస భక్షకులను సురాపాన రతుల
దానవాకార మానవాధముల నెల్ల
మూర్ఖుల నిరక్ష రాస్యుల, మోయ లేక
ఏడ్చు చుండును మేదిని, యెడము లేక

గీ. ఫలల భక్షణ చేదేహ బలము పెంచి
కూలి దెచ్చు రూకలు పది, కూటి కొరకు
శాఖభక్షణ చేబుద్ధి శక్తి పెంచి
ఎత్తు చుందురు జీతాలు వేనవేలు

# మనోనిగ్రహము రహస్యము

గీ. మనసు కభ్యాస, వైరాగ్య, మర్మములను
దెల్ల క్షణములో వశముగు, తేటగాను
యమ నియమ యోగ సాధనాభ్యాస మంత్రు
బ్రహ్మ శాంతి సుఖముల వైరాగ్య మంత్రు

గీ. ఎవ్వడొక్కము హూర్తమునేక దృష్టి,
నాసికాగ్రమునందుంచి నయముగాను.
దైవనామము జపియింప ధరణి యందు
నూరు జన్మల పాపాల పోరు బాయు

## జపము

గీ. ఏక, బహువచన, విభక్తి, ఎచట లేక,
పుం, నపుంసక స్త్రీలింగములును లేక.
నామరూప, గుణ రహిత నాదమయ్యి
పలుకు నోంకార శబ్దంబు ప్రాభవముగ
జపవిధాన మెరిగియును జపము జేయ
యజ్ఞఫలితంబు కంటెను, అధిక మిచ్చు

గీ. ఎవ్వడొక్క క్షణము పరమేశు జపము
జేయ వాని, పాపములెల్ల చిదిగి పోవు
భానుడుదయింప చీకటుల్ పారినట్లు
విషయ వాసన వులులన్ని వెడలి పోవు

## అపథ్యాహారము

గీ. పులుపు, కారము, చేదుప్ప, పులికడుగులు
ఉలవ రేగువండింగువ, ఉల్లి, ఎల్లి,
ఆకు కూర నువ్వులు, నూనె, అవ, కల్లు,
మధువు మాసంబు వెల్లుల్లి మాన్యులకును
వర్జనీయంబు మజ్జిగ వరుసగాను

# పథ్యము

గీ. గోదుమలు, వడ్లు, యవలు, శుద్ధోదనంబు
తిప్ప తీగ, పచ్చ పెసలు, తేనె, శొంఠి,
పంచదార, వెన్నయు, పాల్లు, పంచశాఖ
ములను, కండచక్కెర, నెయ్యి ముదమునిచ్చు
ధైర్యమారోగ్య నిర్మల దాయకములు

# జీవకారుణ్యం

గీ. మాంస భక్షకులను సురాపాన రతుల
దానవాకార మానవాధముల నెల్ల
మూర్ఖుల నిరక్ష రాస్యుల, మోయ లేక
ఏడ్చు చుండును మేదిని, యెడము లేక

గీ. పలల భక్షణ చేదేహ బలము పెంచి
కూలి దెచ్చు రూకలు పది, కూటి కొరకు
శాఖభక్షణ చేబుద్ధి శక్తి పెంచి
ఎత్తు చుందురు జీతాలు వేనవేలు

# మనోనిగ్రహము రహస్యము

గీ. మనసు కభ్యాస, వైరాగ్య, మర్మములను
దెల్ల క్షణములో వశమగు, తేటగాను
యమ నియమ యోగ సాధనాభ్యాస మంత్రు
బ్రహ్మ శాంతి సుఖముల వైరాగ్య మంత్రు

గీ. కుమతి లక్షణములు తమోగుణము లంద్రు
జ్ఞాన శూన్యత, కోపంబు, చాల యుండి
రాక్షస పిశాచ కర్మల రక్తితోడ
ముందుకెళ్లియు జేయుటే మూఢ మంద్రు

గీ. క్షిప్తమన, రజోగుణము, నిక్షిప్త మనగ
సాత్వికంబంద్రు పండితుల్ సాధు జనులు
పలుకు చుందురే కాగ్రికి బ్రహ్మనిష్ఠ
పలుకుదురు నిరుద్ధంబు సమాధి యంద్రు

## మనో నిగ్రహ రహస్యము

గీ. మాన సారణ్య మందున మత్తుగాను
విషయ వాసన గజములు విరివి గెగురు
వాసనా శూన్య సింహంబు వచ్చెనేని
విషయ వాసన గజములు వేళ్లి పోవు

గీ. ఆత్మకంటె మేటి, ఇతర హరుడు లేడు
ఆత్మ తృణమునందైనను అటలాడు
దేహమంతట పరమాత్మ తిరుగు చుండు
జగము నెల్లను పరమాత్మ చరణ మయము

గీ. బుద్ధి, చిత్త, మహంకారములును లేవు
ఇంద్రియము లేవియును లేవు ఈర్ష్య లేదు
ప్రాణ వర్గములును లేవు పరువు లేదు
శుద్ధ బోధరూ పుడవీవె శూన్యదేహ

# మోక్షమునకు శాస్త్రము మాత్రమే చాలదు

గీ. వేదములు నాలుగు చదివి వేత్త యైన
ధర్మ శాస్త్రాలు చదువు మేధావి యైన
సద్గురుని వద్ద సర్వంబు చదువ కున్న
వ్యర్థమగు వాని జన్మంబు వసుధ యందు
కాయ గూరలో దిగుగాడు గరిట సమము

గీ. దేహమున్నంత కాలము దివ్యమైన
సుఖము లనుభవింప పిదప సుఖములిచ్చు
శాంతి సుఖములనిచ్చును శాశ్వతముగ
బ్రహ్మ విద్యయే ఆనంద ప్రాప్తినిచ్చు

గీ. శాస్త్రమెల్లను జదివియు సార మెరుగ
వేయ్యి జన్మలకైనను వీలు కాదు
బ్రతుకు అల్పము దానిలో బ్రహ్మవిద్య
నెరుగ యత్నింపు విజయంబు నీకు గలుగు

గీ. విద్యయున్నధనము వచ్చు, విరివిగాను
హాయి గానుండు పరులకు హాయి నిచ్చు
నదియె లేకున్న జన్మనిరర్థకంబు
పుట్టి ఫలమేమి మోదుగ పువ్వుపగిది

గీ. జన్మసార్థకము కొరకు జగతియందు
నేర్చవలె విద్యనందరు నీతి కొరకు
విషయ వాసన వీడక విద్య వలన
శాస్త్రములునారు చదివిన శాస్త్రి కాడు.

## జీవన్ముక్తుని లక్షణము

గీ. బ్రహ్మ, విష్ణు, మహేశ్వర ప్రజ్ఞదెలియు
అబల, మోక్షార్థుని గుణము లరయ లేరు
శుద్ధ పరమేశు రూప సంశోభి తునిది
బ్రహ్మ శక్తిని వివరింప బ్రహ్మ వశమె.

గీ.. దాన, ధర్మ, యజ్ఞ, తపము, ధ్యానములను
పుణ్య కర్మల నిష్కామ బుద్ధి తోడ
సలుపు వానికి సుఖభోగ శాంతి నిచ్చు
మానవత్వంబు దెలియు నీ మనసు యందె

## సర్వ సంగ్రహము

గీ. యమ, నియమ యోగ, తపములు, అష్టయోగ
పరిచయంబున్న యతియైన, పతన మగును
మోక్ష మేమాత్ర మబ్బదు మునికియైన
ఇంద్రియాల వశమునందు, ఇముడి యున్న

## దైవ భక్తి

గీ. భక్తి యొక్కటే భవరోగ మాయ పంకి
లంబు, పతనంబు, గావించి, లయముజేయు
భక్తి యొక్కటే పరమాత్మ పంచ జేర్చు
పరమ తత్వపరమ ముక్తి పదము భక్తి

గీ. భక్తి సనకస నందుల భాగ్యమయ్యి
శాంతి సుఖముల నిచ్చెను చాల వరకు
భక్తి వల్ల నారద, శుక, బ్రహ్మ ఋషులు
శాశ్వతానందమొందిరి శక్తియుతులు.

గీ. రామ నామంబు జిహ్వాగ్ర రాగమయ్యి
నాట్యమాడ భుక్తియు ముక్తి నడచి వచ్చు
కడప పైదీపమును బెట్ట కాంతి బయలు
దేరి వెలుగు నిచ్చును అన్ని దిశల కెల్ల

గీ. భూతహిత కార్యములు సల్ప పుడమి యందు
జీవ రాశిలో నిల్చిన శివుని జూచి
సేవ జేసెడి భక్తుడే శీఘ్ర ముగను
మోక్ష మొందును దైవమామోద మొంద

గీ. వర్ష బిందువు ధారలై వచ్చి భువిని
ఏకమై ప్రవహించును యేటియందు
పలురకాల మూర్తుల మ్రొక్క ప్రణుతు లెల్ల
జేరు నారాయణ చరణ చెంతకన్ని

## అహింస

గీ. భూత దయకును సమమైన పుణ్యఫలము
ప్రాణి పీడన సమమైన పాతకంబు
లేదు లేవంచుదెలిపిరి వేద విదులు
మానవత్వంబు గల్గిన మానవులకు

గీ. మనసుచే కర్మచే వాక్కు మహిమ చేత
సాధు జీవుల సంతాప సమయ మందు
సానుభూతిని జూపియు సాక వలయు
లేక యుండిన దానవ లీల యగును.

గీ. పోషణార్ధమై దేహంబు పోవు వరకు
గోదుమలు కందిపప్పాకుకూర పాలు
మాంసమున కంటె నెక్కుడు బలము నిచ్చు
నైన్సు శాస్త్రజ్ఞులే చెప్ప సర్వమెరిగి
పశువులన్ గోసి దిననేల భారతీయ

## కర్మ కర్మణానశ్యతే

సీ. అన్నిజన్మలలోన అధికంబు నరజన్మ
నారి జన్మము కంటె నరుడు మేలు
పురుషజన్మలలోన భూసురుడును మేలు
బ్రహ్మణ జాతిలో వైదికుడును
మేలు, వివేకియే మేలగు వాడెమే
లు ధరణి జన్మలలోన గొప్ప
ఏ పుణ్యకర్మైన ఈశ్వరార్పణ జేయు
నట్టి వాడె ఘనుడు అవని యందు

గీ. జ్ఞాన మార్జింపకను నర జన్మకాదు
పుణ్యకర్మలు చేసిన ముక్తి కల్గు
కర్మజేయని వానికి కల్గు హాని
కర్మవలననే మోక్షంబు కల్గునిజము

# అహింస

సీ. యాత్రలు దిరిగియు యాగంబు జేసియు
శాస్త్రాలు జదివియు, సర్వమెరిగి
దానముల్ జేసియు, ధర్మశాలలు గట్టి
తీర్థముల మునిగి తేలి యాడి
సత్యంబు పలికియు సంగీత మబ్బియు
సాధు వేశాలచే సంచరించి
జపము జేయ కురులు జడలుగట్టినగాని
ఫలితంబుదక్కక పతన మగును

గీ. భక్ష్యనైవేద్యములు బెట్టి భక్తితోడ
మూర్తి పూజలు జేయగా ముక్తి లేదు
హీన మతులయ్య జీవుల హింస జేయ
లేశమైనను లాభంబు లేదు నిజము
చెప్పచున్నాడు బిచ్చయ్య చిన్ని మాట

## అచల భావరహస్యము

గీ. సాత్వికాహార భోజన శక్తి చేత
ఆయురారోగ్యసంపదల్ అధిక మగును
పాడిపంటలు ఒళ్ళకు బలమునిచ్చు
ఇతర మేదైన మనిషిని హీన పరచు

గీ. సత్వ గుణముచే జ్ఞానము సంభవించు
కలుగు బాధ రజోగుణ బలము వలన
పుట్టు చుండుమోహము తమో గుణము వలన
జ్ఞాన మజ్ఞాన సుజ్ఞాన సంగ్రహంబు
సత్వము, తమో రజోగుణ శక్తి యండ్రు

గీ. వగరు చేదు పులుపు వేడి వలయు వాడె
రాజసాహార సేవన రక్తిపరుడు
చంచల మతుడై చీకాకు చాల పడుచు
కోప తాపము చేతను కుములు చుండు

గీ. తామ సాహార భక్షణ తాత్వికుండు
మత్స్య మాంసాది దుర్గంధ మలినములను
నీచమౌకల్లు చల్లుల నియము వీడి
కోరుచుండును నిరతంబు, కుడుచు చుండు

## ఖేచరి యోగము

గీ. ఖేచరీయోగ మభ్యాస మాచరింప
కంఠకుహరమందున నాల్క కదల కుండ
జేయ దలచి ఛేదింత్రు సచేతనులును
భక్షణ మగు గోమాంస శబ్దార్థ మందు

గీ. ధ్యాన నిష్ఠలో నాలుక, మనసు ప్రాణ
వాయువును, మూడు నొక్కటే వాస మందు,
జేర్చ, అమృతధారలు వచ్చి చేరగాను
పాన మొనరించి తరియించు ప్రాజ్ఞుడిలను

శ్లో. గోమాంసం భక్షయేన్నిత్యం పిబేదమరవారుణీమ్
కులీనం తమహమ్మన్యే ఇతరేకుల ఘాతకా:

# జాతిభేద రహస్యము

గీ. బ్రాహ్మణుండైన బహు గొప్ప భక్తిలేక
మంచి గుణములు లేకున్న మాల సమమె
మాల వాడైన మనసులో, మంచి గుణము
భక్తి భావమున్న అతడె బ్రాహ్మణుండు

గీ. పుట్టు వారెల్ల శూద్రులే పుట్టినపుడు
ఆత్మ సంస్కార కర్మచే అధికుడగును
వేదపఠనంబు పాటించి విప్రుడగును
బ్రహ్మజ్ఞానియే ఇలపైన బ్రాహ్మణుండు

ఆ.వె. మనిషిలో గుణగణ మహనీయ శక్తిచే
బ్రహ్మ, క్షాత్ర, శూద్ర వైశ్య, కులము
లెంచవచ్చు గాని ఇల్లు ఒడలు, బట్టి
ఏర్పడదుకులంబు ఎచ్చటైన

గీ. శూద్ర కులమున బుట్టిన శుభములొసగు
సకల సద్గుణ సంపన్న సాధువైన
బ్రాహ్మణునికన్న మిన్నయై బ్రతుక గలడు
బ్రాహ్మణ కులమందుదయింప ఫలము లేదు

గీ. నాదు భక్తుల జూచియు నవ్వుకొనుచు
కులము మతముల నెంచెడి క్రూరజనుల
కోటి వర్షముల వరకు కుములు నట్లు
నరక మందున ముంచెద నమయు గాను

గీ. నన్ను నమ్మిన భక్తుల నమ్మకుండ
నిందమోపెడి నీచుల నిశ్చయముగ
కోటి పద్మాల పూజింప కోపముడిగి
శిక్ష వేయక మానను శేషకైన

గీ. గొప్ప కులమున బుట్టుటే గొప్ప కాదు
సాటి జీవుల కల్యాణ సమయమందు
నడుము గట్టుక ముందుకు నడచువాడు
చిన్న కులమున బుట్టిన శ్రేష్ఠుడతడె

ఆ.వె. పూత, పిందెకాయ, పుట్టును చెట్టులో
కొరికి చూడరుచుల, కులము వేరు
చేదు, వగరు, పులుపు చే తీపియగుచుండు
పాక మైన మధుర ఫలము యగును

గీ. జన్మమెత్తిన బ్రాహ్మణ జాతియందు
దూరుడైన సదాచార దూరుడైన
సంకరపు బోజనము జేయ సమసి పోయి
బ్రాహ్మణ త్వంబు నీచుడై బరగు చుండు

## సాధు సేవ

గీ. మంచి గోత్రాన జన్మించి మనుషులెల్ల
యజ్ఞ ముల్ జేయ పుణ్యంబు లబ్బునంత
సాధు దర్శనార్థము వెళ్ళు సజ్జనునకు
అడుగు అడుగున, పుణ్యంబు అధికమబ్బు

గీ. జప తపాది కృత్యంబులు జనులు జేయ
పుణ్యమే మాత్ర మబ్బునో పొందు గాను
బ్రహ్మ నిష్ఠుని సాంగత్య బలము వలన
నెగడు చుండును పుణ్యంబు నిశ్చయముగ

గీ. జ్ఞాని యగు మహాత్ముడెవరి జ్ఞానమునకు
సంతసించియు వచ్చునో సదనమునకు
వాని యంటను దేవతల్ వరుస గాను
తాండ వింతురు ఆనంద తన్మయులయి

గీ. సాధు సన్నిధి నున్నట్టి సాత్వికునకు
శ్రేష్ఠ సంకల్ప జాలము పుష్టి గుండు
సాధు వాక్యాల శక్తిచే శాంతమబ్బు
చేరు జ్ఞానంబు మౌనుల సేవ వలన

## విషయ బంధకము

గీ. పుష్ప గుచ్ఛము పై వాలిప్రోగు జేయ
తేనె టీగలు మధువుకై తిరుగునట్లు
మోక్ష సంపద కోరియు మునులు ఎపుడు
దైవ నామంబు జపియింప ధ్యాననిష్ఠ
సలుపు చుందురు నిరతంబు సాధుజనులు

గీ. చిత్తమెవ్వని అరచేత చిక్కెనేని
మూడు లోకాలు వానిచే ఓడిపోవు
దాని నోడింప జేయనీ ధర్మమయ్యు
దేని నైన జయింతువు ధీర హృదయ

గీ. మనసు శుద్ధమైన నదియె మర్మ మెరుగు
మనసు మలినమైన నదియె మారి యగును
విషయ వలయమందేగిన వెర్రి యగును
విషయ వాసనలోడింప వేత్త యగును

గీ. కోరికలు రెండు విధముల కూడియుండు
శుద్ధ వాసన మోక్షసంశోభితంబశుద్ధ
వాసన నరక సంశోభితంబు
జనన మరణము లేనట్టి జన్మకొరకు
పాటు పడుటయే నీవంతు భారతీయ

గీ. కోరికలనెడి సెలయేళ్ళు, కొండలందు
మార్గ మెరుగక ప్రవహించు, మంచి చెడుల
నిగ్రహ మనెడి కట్టలన్ నీరు నిలిపి
పంట పొలముకై కాల్వల మలపునట్లు
పాటు పడుటయె నీవంతు భారతీయ

గీ. విషయ వాంఛలు వున్నట్టి వెర్రివారు
అనుభవింతురు సుఖములు ఆర్తితోడ
వెర్రి కోరిక లేనట్టి వేత్తలెపుడు
అనుభవింతురు సుఖములు అధికముగను

గీ. ఇంద్రియ సమస్త మందాక యింద్రియంబు
వేళ్ళనేని ప్రాపంచిక విషయ మందు
ప్రజ్ఞనశియించు వాడిల పతనమగును
ముల్లు గ్రుచ్చపడవ నీట మునిగినట్లు

గీ. క్రోధ, కామ, రజోగుణ, కుత్రవలన
కార్యహానియు, గల్గును కచ్చితముగ
పాప కూపము నంద్రోయు పరుషముగను
గొప్ప శత్రువు కామంబు గోప్యముగను

గీ. జ్ఞాన కర్మేంద్రియాలను జ్ఞప్తితోడ
విషయ వాసన వైపుకు వెళ్ళకుండ
అంతరాత్మను సుఖపెట్టు ఆచరణము
లాచరించిన ఆనంద లహరి యందు
ఆత్మసుఖపడునెంతయో హాయిగాను

## విషయ వాంఛాపాయము

గీ. విషము కంటెను విషయంబు విరివిగాను
చంపివేయును మనిషిని చాలవరకు
తిన్నవాడె చచ్చు విషము, తిన్నగాను,
విషయములను దలుప చంపు వెంట బడియు

గీ. అందగత్తెల వైపున కరుగ దృష్టి
ఎంత మహనీయుడైనను చెంత జేరి
నరక మందున పడిపోవు నారివల్ల
భ్రష్టుడగు చుండు మహిళచే భారతీయ

గీ. చూచినంతనే చిత్తంబు సోలి పోవు
తనువుపై వాలినను వాని ధనము తరుగు
మైథునంబున చెడు లోక మాన్యుడైన
వెర్రి పుట్టించి హరియింత్రు వేశ్య లెపుడు

గీ. ధనము నశియించు వెలయాలి తనువుగోర
మాన మంతరించును దాసి మైథునమున
ఆయువంతరించు విధవ, పాయి గిల్ల
అంతరించు సర్వము, అన్యకాంతవలన

గీ. నారి సౌందర్యరాశియే నరక మందు
ముంచివేయును నరులను మోజు దీర్చు
చీము నెత్తురు మాంసంబు చెత్త కొరకు
బ్రతుకు బలిచేయ తగున ఓ భారతీయ

గీ. రాత్రి వెలుగును చంద్రుని రాక వలన
పగలు వెలుగు సూర్యుని బలము వలన
కులము వెలుగును పుత్రుని గుణము వలన
ధర్మమే మూడు లోకాల దండె వెలుగు

గీ. అందచందాల నారిచే హసితముగను
అడుగు ముందుకు వేసి మాట్లాడు వారు
ఎంత ధనమున్న బలమున్న ఏమి ఫలము
తుదకు వలపుల కోడెడి తొత్తుయగును
సబలు డేలయగు పురుషుడబలగాక

## పాషండులు

గీ. ఈశ్వరార్చన వలదను హీన మతిని
వేదధర్మాలు దాటెడి వెళ్లి వాణ్ణి
దేహపోషణే విధియంచుదెలుపు వాణ్ణి
సర్వమతములు వాణ్ణి పాషండు డంద్రు

# పాపరతులు

గీ. వాక్కు తనువుచే మనసు చే వాంఛదీర
ప్రాణహింసాది కర్మల పాప మనక
మధువు మాంసంబు భుజియించు మానవులను
పాపరతులంద్రు వారిని పొరులెల్ల

# దైవ భక్తి

గీ. శివుని వేడగ చిత్తంబు చెదరకుండ
పుణ్యకర్మలు జేసెడి పూజ్యులకును
ఈశ్వరాజ్ఞచే సిద్ధించునేదియైన
బుద్ధి శక్తియు యుక్తియు, భోగములును

# సూచన

గీ. కట్నమెక్కువ యిచ్చెడి కన్యకొరకు
ప్రాకులాడుదురేలకో పాలు మాలి
కట్నమేవచ్చి చేయునా కాపురంబు
కష్ట మెంచక జేసెడి కన్యవలదె ?

గీ. కన్న కడుపును చల్లగా కండ్లజూడ
అస్తులంతస్తులేమాత్ర మరయవలదు
వరుణిగుణముల మాత్రమే పరుల నడిగి
కన్య నిచ్చుట ధర్మంబు కన్నవారు

గీ. తరుణవయసుకు రాగనే తల్లిదండ్రి
వెతకి వేలివ్వ వరునకు వెర్రి గాదె
బ్రతుక జాలరు మగవారు భార్యలేక
మానవత్వంబు యున్నట్టి మగనిజూచి
పెండ్లి చేయుట పుణ్యంబు ప్రేమతోడ

## సంసార విముక్తి

గీ. బ్రహ్మనిష్ఠచే పరమేశు భజన జేయ
కరుణగల్గియు ప్రేమచే కలిమినిచ్చు
గురువు సద్గ్రంథ కావ్యముల్ కూర్మితోడ
చదువ, వచ్చును శాంతంబు చాలవరకు

గీ. గురువు దైవము పైగల గొప్ప భక్తి
యున్న మనుజుడేయిల పైననోర్మితోడ
రాజయోగియై విలసిల్లు, రాజ్యమందు
దైవకారుణ్య గురువాజ్ఞ ధాటి వలన

గీ. సర్వకామాలు నశియింప శాశ్వతముగ
వానిగుండెలో నివసించు వనజ భవుడు
దేహముండియు జీవించు దేవుడతడె
ఆత్మ దర్శన యోగంబు అబ్బెనేని

